**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమద్వరవరమునయే నమః**



# వేదవైభవం-1



యోగ నరసింహ స్వామి షోలింగర్



'పండితరత్న' డా|| ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అప్పగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విన్నపం

భారతీయులందరికీ పరమ ప్రమాణం వేదం. దీన్ని ఆధారంగా చేసుకునే వైదిక సిద్ధాంతాలన్నీ ఉద్భవించాయి. వేదాంత సిద్ధాంతాలే కాకుండా, సమస్త శాస్త్రాలకు, కళలకు ఆధారం వేదమే అని మహనీయులైన విద్వాంసులచే సప్రమాణంగా, సోదాహరణంగా నిరూపింపబడింది. వేదాలకు తరవాత ప్రమాణలుగా స్వీకరింపబడే ధర్మశాస్త్రాలు, ఇతిహాసాలు, పురాణాలు అన్నీ కూడా వైదిక సిద్ధాంతాలను న వివరించేవిగానే ప్రకాశిస్తున్నాయి. వైదిక సిద్ధాంతాలకు విరుద్ధంగా ఎవరు ఎప్పుడు ఏమి చెప్పినా, అది అప్రమాణంగానే భారతీయులు భావిస్తారు.

వేద మహిమను మాక్సుముల్లర్, మేక్ డోనాల్డ్, కీత్  వంటి విదేశీయ విద్వాంసులు సైతం గుర్తించి ప్రశంసించారు. ఈ వేదమే భారతీయులందరినీ ఆసేతుహిమాచలం కలిపే అత్యంత బలమైన, ఆశ్చర్యకరమైన సూత్రంగా వారు గుర్తించారు. ప్రపంచ సాహిత్యంలో ఋగ్వేదం మొట్టమొదటి గ్రంథంగా గుర్తింపబడింది.

ఇటువంటి అనితర సాధారణమైన వైభవాన్ని కలిగిన వేద మహిమనుగూర్చి, ప్రామాణ్యాన్ని గూర్చి, వేదంలో  గ్రహించదగిన వివిధ రహస్యాలను గూర్చి సుప్రసిద్ధ విద్వాంసులు ఉ.వే. శ్రీమాన్ నావల్ పాక్కమ్ యజ్ఞవరాహాచార్యులు అనబడే కణ్ణన్ స్వామి 17 శీర్షికలలో వేదమహిమను విస్తృతంగా నిరూపించే "వేదవైభవమ్" అనే గ్రంథాన్ని ద్రావిడభాషలో రచించగా, అది మధురై విశ్వవిద్యాలయం ద్వారా ప్రకటింపబడింది. ఆ గ్రంథంలోని "వేదప్రామాణ్యమ్" మొదటి శీర్షికలోని అంశాలు ప్రస్తుతం ఆంధ్రీకరించి, ఆస్తికులకు నివేదింపబడుతున్నాయి. అనువాదంలోని దోషాలను పెద్దలు మన్నిస్తారని భావిస్తాను. మిగిలిన శీర్షికలలోని అంశాలు కూడా క్రమంగా నివేదింపబడతాయి.

ఈ ద్రావిడ గ్రంథాన్ని నాకు స్నేహపూర్వకంగా అందజేసి సహకరించిన సహృదయులు, పండితులు, మిత్రమణి, శ్రీమాన్ చక్రవర్తి రంగనాథన్ స్వామివారికి కృతజ్ఞతాపూర్వకంగా దాసోహాలను సమర్పించుకుంటున్నాను.

సహృదయనియోజ్యుడు
ఈ. ఏ. శింగరాచార్యులు

# దివ్య ప్రబంధ సూక్తులలో వేదమహిమ

## 1) తిరుచ్ఛంద విరుత్త ప్రబంధంలో వేదమహిమ ప్రస్తావన

"వేదనూల్ ఓదుకిన్రదు ఉణ్మైయల్లదిల్లై మ*ఱ్ఱు*రైక్కిలే" అని తిరుచ్ఛంద విరుత్త ప్రబంధంలో తిరుమ*ழி*శై ఆ*ழ்*వారులు పలికారు.

ఈ వాక్యాన్ని రెండు వాక్యాలుగా విభాగం చేయవచ్చు. మొదటిది వేదనూల్ "ఓదుకిన్రదు ఉణ్మై" అనేది. వేదం చెప్పేది సత్యం అని, అబద్ధం కాదని దీని భావం. రెండవ వాక్యం "—అల్లదు ఇల్లై" అనేది. ఇక్కడ "అల్లదు" అనేదానికి – వేదం కంటే ఇంకొక శాస్త్రం— అని అర్థం. అది సత్యం కాబోదు కాని ఇక్కడ భావం. ఆ విధంగా అయితే, ఇతిహాస పురాణాలను మనం ప్రమాణంగా ఎందుకు స్వీకరిస్తున్నాము? అని అంటే, దానికి సమాధానమే "అల్లదిల్లై మ*ఱ్ఱు*రైక్కిలే" అనేది. "మ*ఱ్ఱు*" అంటేవేదానికి విరుద్ధంగా ఉండే —అని అర్థం. వేదానికి విరుద్ధంగా పలికితే, ఏ శాస్త్రం అయినా అది ప్రమాణం కాబోదు— అని ఇక్కడ భావం. వేదానికి ఉపబృంహణంగా పలికే ఇతిహాస పురాణాలు ప్రమాణం కావడంలో ఏ అడ్డం లేదు.

ఈ ఆళ్వారుల పాశురానికి ఇంకొక విధంగా కూడా అర్థం చెప్పవచ్చు. "మ*ఱ్ఱు*రైక్కిలే" —ఇంకా చెప్పవలసి వస్తే – అని అర్థం. (ఈ పాశురంలో ఇంతకు ముందు చెప్పిన త్రిమూర్తుల పరస్పర సంబంధక్రమం మాత్రమే కాకుండా, దానికి పైన కూడా చెప్పాలంటే, అది, "వేదనూల్ ఓదుకిన్రదు" – వేదంలో చెప్పిన అర్థం, "ఉణ్మైయల్లదిల్లై"— అసత్యం కాదు, నిశ్చయంగా సత్యమే— అని అర్థం.

ఈ రెండు అర్థాలకు ఏమి తేడా? అంటే, రెండవ అర్థంలో "ఉణ్మైయల్లదిల్లై"— అని అన్వయించి, వేద ప్రామాణ్యంలో దార్ఢ్యాన్ని తెలియజేశారు. మొదటి అర్థంలో "అల్లదు ఉణ్మై ఇల్లై" అని అన్వయించి, ఇతరార్థాల అప్రామాణ్యాన్ని తెలియజేసి, వేదం మాత్రమే మూల ప్రమాణం కావడాన్ని దృఢపరచారు.

"వేదం నిజమే, వేదమే నిజం" అనే ఈ రెండు అర్థాలలో ఏవకారం, మొదటి అర్థంలో అయోగవ్యవచ్ఛేదాన్ని, రెండవ అర్థంలో అన్యయోగం వ్యవచ్ఛేదాన్ని తెలుపుతున్నదని శాస్త్రక్రమంలో చెప్పబడుతుంది.
వేదం పలికేది సత్యమే, సత్యాన్ని పలికేది వేదమే.

## 2) తిరువాయ్ మొழி ప్రబంధంలో వేదమహిమ ప్రస్తావన

"అఱిందన వేద అరుమ్ పొరుళ్ నూల్ కళ్" అనే తిరువాయ్ మొழி ప్రబంధ సూక్తిని ఇక్కడ గమనించాలి. ఈ సూక్తి లో వేదాలు అనే శాస్త్రం సత్యాన్ని తెలిసినది– అని చెప్పబడుతున్నది. దీనిని వివరించే ఆఱాయిరప్పడి వ్యాఖ్యానంలో కూడా "నిర్దోషమాకైయాలే అతిదుర్లభ ప్రయోజనరూప అర్థవత్తాయ్, పరమపురుష యాథాత్మ్యజ్ఞాపనాయైవ ప్రవృత్తమాన సకలవేదంగళాలుమ్" ( ఏ దోషం లేనిది అయినందున చాలా దుర్లభ ప్రయోజన రూపాలైన అర్థాలను కలిగినవై, పరమ పురుషుని యథార్థ స్వరూపాన్ని తెలుపడం కోసమే ప్రవర్తించినవి అయిన అన్ని వేదాల చేత) అని పలికింది. వేదాన్ని "అరుమ్ పొరుళ్ నూల్" అని ఆళ్వార్లు అంటున్నారే. ఎందుకు? అనే ప్రశ్నకు సమాధానం పిళ్ళాన్ ఇక్కడ అనుగ్రహించే "అతిదుర్లభప్రయోజన" అనే సూక్తిలో ఉన్నది. అరుదైన వస్తువులు, అంటే– భగవంతుడు, పరలోకం, మోక్షం మొదలైనవి, ఇందులో, అంటే, వేదంలో, ప్రయోజనంగా చెప్పబడినందున, ఇది "అరుమ పొరుళ్ నూల్". (అరుదైన అర్థాలను తెలియజేసే శాస్త్రం). పారలౌకిక పురుషార్థాలు, వాటి ఉపాయాలు అరుదైన అర్థాలు అనే విషయంలో అంతర్భవిస్తాయి. వాటిని తెలిసినవి, తెలియజేసేవి, వేదాలు.

ఇంకొక విధంగా కూడా ఇక్కడ అర్థాన్ని చెప్పవచ్చు. వేదంలోని అర్థం సులభంగా లేకుండా దుర్లభంగా ఉన్నందున, దానిని "అరుమ్ పొరుళ్ నూల్" అని అనవచ్చు. "పొరుళ్" అనేది ద్రావిడ పదానికి, "అర్థం" అని సంస్కృత భాషలో చెప్పే పదానికి ఎన్నో అర్థాలు ఉన్నాయి. పదం యొక్క అర్థం, దానికోసం– అనే అర్థాలలో ఈ పదం

ప్రయోగింపబడడం చూడవచ్చు. “ప్రయోజనం” అనే దానిని కూడా “పొరుళ్” అనే ద్రావిడ పదానికి అర్థంగా చెప్పవచ్చు అని అంటున్నారు, పిళ్ళాన్. “ఎఱ్ఱైక్కు ఉఱుంగుమ్ పొరుళ్”, “పొఱ్ఱామరైయే పోఱ్ఱుమ్ పొరుళ్ కేళాయ్” అనే తిరుప్పావై ప్రబంధంలోని సూక్తులను గమనించవచ్చు. “పొరుళ్” అనే పదానికి –ప్రయోజనం– అనే అర్థం ఉన్నందున, “వేద అరుమ్ పొరుళ్ నూల్ కళ్” అనే ప్రయోగంలో కూడా ఈ అర్థం పొసగుతుంది అని వ్యాఖ్యాత ఉద్దేశ్యం.

## 3) పెరియ తిరుమొழி ప్రబంధంలో వేదమహిమ ప్రస్తావన

తిరుమంగై ఆழ்వారుల పెరియ తిరుమొழி ప్రబంధంలో “ఉణ్మై మికు మఱై” (సత్యాన్ని నిండుగా కలిగిన వేదం) అనే సూక్తిని గమనించాలి.

“అసత్యమైనవానిని సత్యమైన శాస్త్రమని భావించి, వాటిని నేర్చి, మోసపోవద్దు” అని లోకంలోనివారిని ఆళ్వారులు ఇక్కడ హెచ్చరిస్తున్నారు.

“వెళ్ళియార్ పిండియార్ పోదియార్ ఎన్నివర్ ఓదుకిన్ఱ కళ్ళనూల్” అని వీరే ఇంకొక చోట అన్నారు. కళ్ళనూల్ అంటే– మోసం చేయడం కోసమే వ్రాయబడిన గ్రంథాలు. ఇవి “మోహశాస్త్రాణి” అని పురాణాలలో చెప్పబడతాయి. “పొయ్ న్నూల్” అంటే– అసత్యాలను పలికే గ్రంథాలు. అన్య మతాలవారి ముఖ్యగ్రంథాలు ఈ విధంగా అసత్య గ్రంథాలుగా, వంచకగ్రంథాలుగా కనిపిస్తాయి. కానీ, మన వేదం వాస్తవమే నిండిన శాస్త్రంమై ఉన్నది– అని వివేకించి ఇక్కడ ఆళ్వారులు పలుకుతున్నారు.

ఈ విధంగా భక్తిసార, పరాంకుశ, పరకాలురనే ఆళ్వారులు ముగ్గురుముక్తకంఠంగా వేద మహిమను ప్రస్తుతించారు.

## 4) తిరువాయ్ మొழி ప్రబంధంలో వేద ప్రామాణ్యాన్ని తెలిపే సూక్తి

నమ్మాళ్వారులు తిరువాయ్ మొழி ప్రబంధంలోని మొట్టమొదటి దశకంలోనే వేదాన్ని కీర్తిస్తూ “శుడర్ మికు శురుదియుళ్” అని అన్నారు దీనిని వ్యాఖ్యానించేటప్పుడు పిళ్ళాన్ ఆఱాయిరప్పడి వ్యాఖ్యానంలో

“అపౌరుషేయమాగైయాలే నిర్దోషమాయ్, అబాధితప్రామాణ్య రూపతేజఃప్రకారమాయ్ ఇరుక్కిఱ శ్రుతికళిలే” ( ఆపౌరుషేయం అయినందున ఏ దోషం లేనిదై, ఏ బాధ లేని ప్రమాణమై ఉండడం అనే రూపంలోని తేజఃప్రకామై ఉండే శ్రుతులలో) అని అన్నారు,.

వేదం అనేది శబ్దమా? తేజస్సా? అది శబ్దం అనే విషయంలో ఏ వివాదం లేదు.. అయితే, నమ్మాళ్వారులు ఇక్కడ “శుడర్ మికు శురుది” అని అంటున్నారే! వారు వేదాన్ని తేజస్సుగా చెప్పడం ఎందుకు? అనే సందేహాన్ని పైన ప్రస్తావించిన పిళ్ళాన్ వాక్యం తీరుస్తున్నది. వేదంలో ఉండే తేజస్సు ఏమి తెలుసునా? అబాధిత ప్రామాణ్యం అనేదే. అది తాను ప్రమాణం కావడంతో పాటు, తన అర్థాన్ని వేరు ఏ ప్రమాణం చేత కాదనడానికి వీలు లేనిదై ఉండడమే. అత్యున్నతమైన ప్రమాణమై ఉండడమే వేదంలోని తేజస్సు అని ఇక్కడ అంటున్నారు. ఈ ప్రామాణ్యాన్ని కాంతిగా చెప్పడం ఎందుకు? అని అంటే, కాంతితో మనం వస్తువులను తెలుసుకోవడం లోకంలో అందరూ తెలిసిన విషయమే. ఆ విధంగానే వేద ప్రామాణ్యాన్ని పురస్కరించుకొని అన్యార్థాలను, అంటే, పారలౌకిక పురుషార్థ –తదుపాయాలను, తెలుసుకోవడానికి సాధ్యమై ఉండడం వల్ల దీనిని తేజస్సుగా చెప్పడం తగును. అందువల్లనే సంస్కృత విద్వాంసుడైన దండి మహాకవి “శబ్దాహ్వయం జ్యోతిః” అని అన్నాడు. శబ్దమనే కాంతి ఇది. ఈ వేదం అనే తేజస్సు లేకుండా పోతే అజ్ఞానం అనే అంధకారం ఆవరిస్తుంది. దుమ్ము, ధూళి పైన పడకపోతే మాణిక్యంలోని కాంతి మిక్కిలిగా ప్రకాశించేటట్లు, పొగపడని అద్దంలో దీపం యొక్క కాంతి మిక్కిలి ప్రకాశించేటట్లు, ఈ శ్రుతి అనే తేజస్సు వృద్ధి కావడానికి అది నిర్దోషమై ఉండడం కూడా కారణం అని అంటున్నారు. పౌరుషేయాలైన మిగిలిన గ్రంథాలకు సంభవించడానికి అవకాశం ఉండే దోషాలు అపౌరుషేయమైన వేదానికి కలిగే అవకాశం లేదు. అందువల్ల కూడా వేదప్రామాణ్యం అనే తేజస్సు మిక్కిలిగా వెలుగుతుంది.

ఈ తిరువాయ్ మొழ்లి సూక్తిని నంబెళ్ళై వ్యాఖ్యానిస్తూ, "అపౌరుషేయమాయ్, నిర్దోషమా యిరుక్కిఱ వేదత్తాలే" ( పురుషులచే నిర్మితం కానిదై అందువల్లనే, ఏ దోషం లేనిదై ఉండే వేదం చేత) అని, "ప్రత్యక్షాది ప్రమాణంగళ్ పోలే హేత్వంతరత్తాల్ కழிక్క వొణ్ణాద ఒళియై యుడైత్తాయిరుక్కై" ( ప్రత్యక్షం మొదలైన ఇతర ప్రమాణాల వలె, వేరొక ఏ హేతువు చేత నిరాకరించడానికి వీలులేని తేజస్సును కలిగినది) అని వ్యాఖ్యానించారు.. ఇక్కడ ఈ సూక్తిని వివరించే అరుంబదంలో కూడా "దీపంలో కనిపించే జ్వాల ఒకటే జ్వాల"– అనే ప్రత్యక్ష జ్ఞానానికి జ్వాలాభేదానుమానం వల్ల బాధ కలుగుతుంది కదా. ఆ విధంగానే "అగ్నిః అనుష్ణః పదార్థత్వాత్, జలవత్" – "అగ్ని వేడిగా ఉండదు, అది పదార్థం కనుక, ఏ విధంగా అంటే, పదార్థమైన జలం వలె" అనే అనుమానజ్ఞానానికి అగ్ని దహించడం అనే ప్రత్యజ్ఞానం చేత బాధ కలుగుతుంది కదా, అటువంటి విధంగా ప్రత్యక్షం చేత అనుమానానికి అనుమానం చేత ప్రత్యక్షానికి బాధ ఉన్నట్లు, శ్రుతి వల్ల కలిగే జ్ఞానానికి ఏ బాధ లేదు. అందువల్ల ఏర్పడిన, "మిక్కిలి తేజస్సుతో నిండినది, వేదం" అని వివరింపబడింది.

ఇక ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యానంలో "శుడర్ మికుకై యావదుయత్వ నిబంధనమాన విప్రలంభాది దోషరహితముమాయ్, ప్రమాణాంతరంగళై క్కొండు బాహ్యకుదృష్టికళాలే అవి అవిచాల్యమాకైయాలే మిక్క తేజస్సై ఉడత్తాయిరుక్కై" ( వేదం మిక్కిలి తేజస్సు కలిగి ఉండడం అంటే– పౌరుషేయాలై ఉండడంచేత ఏర్పడే మోసగించడం, ఉన్నదాని కంటె వేరుగా చెప్పడం మొదలైన ఏ దోషాలు లేనిదై, ప్రమాణాంతరాలతో బాహ్యమతలవారి చేత, కుదృష్టిమతాల వారి చేత కాదనడానికి వీలు లేనిదే ఉండజంచేత ఏర్పడిన గొప్ప తేజస్సును కలిగి ఉండడం) అని వివరింపబడింది.

ఈ విధంగా అపౌరుషేయాలు కాకుండా, పురుష నిర్మితాలైన చార్వాక మాయవాద భాస్కరీయయాదవ ప్రకాశాది వేదవిరుద్ధ మతాలన్నీ ఇక్కడ ఆ పౌరుషయమైన వేదం చేత నిరాకరింపబడ్డాయి అని కూడా పిళ్ళాన్ వివరణం.
ఇప్పుడు వేద ప్రామాణ్యాన్ని తెలిపే కొన్ని ఉపబృంహణ సూక్తులను, పూర్వాచార్య వచనాలను అనుశీలనం చేద్దాం.

5) ఆపస్తంబ ధర్మ సూత్ర ప్రారంభంలోనే "అథాతః సామయాచారికాన్ ధర్మాన్ వ్యాఖ్యాస్యామః, ధర్మజ్ఞ సమయః ప్రమాణం, వేదాశ్చ" అని ధర్మాలను తెలియడానికి వేదాలు ప్రమాణం అవుతున్నాయి అని చెప్పబడింది. తరువాత ఇంకొక చోట "శ్రుతి ర్హి బలీయసీ అనుమానికాత్ ఆచారాత్" అని వేదప్రామాణ్య ప్రాబల్యం చెప్పబడింది. పెద్దల చక్కని ఆచారాలు ప్రమాణాలే అయినా, అవి వేదం వలే నేరుగా ప్రమాణం కావు. అవి అనుమానికాలు. వానిని పురస్కరించుకొని మనం "వేదంలో కూడా ఈ విధంగా ఉంటుంది" అని ఊహిస్తాము. ఆ ఊహను అనుసరించి వానిని ప్రమాణంగా గ్రహిస్తాము. వేదం అయితే, ఆ విధంగా కాకుండా, నేరుగా ప్రమాణం అవుతున్నది.

6) బ్రహ్మసూత్రాలలో మాటిమాటికి వేద ప్రామాణ్యం దృఢంగా ప్రస్తావింపబడింది. వాటిలో ఒకే ఒక్క సందర్భాన్ని మాత్రం ఇక్కడ మనం గమనిద్దాం. కృత్స్నప్రసక్త్యధికరణంలో పూర్వపక్షి ఒక అక్షేపాన్ని లేవనెత్తుతున్నాడు. పరతత్త్వమే లోకంగా పరిణమిస్తున్నది అని, పరతత్త్వానికి అవయవాలు లేవు అని చెప్పే వేదవాక్యాలు వాస్తవాలు అయితే, జగత్ సృష్టి కి తర్వాత పరతత్త్వం అనేది లేకుండా పోవాలి. పరతత్త్వంలో ఒక భాగం లోకంగా పరిణమించింది, ఇంకొక భాగం బ్రహ్మగానే మిగిలి ఉన్నది– అని చెప్పడానికి లేదు. ఎందుకంటే, ఈ విధంగా భాగాలు బ్రహ్మకు లేవు– అని వేదం చెబుతున్నది. బ్రహ్మం నిరవయవం అనే శ్రుతులను విడిచిపెట్టడమా? లోక సృష్టికి తరువాత బ్రహ్మ ప్రత్యేకంగా, పూర్ణంగా లేదని అనడమా?

జగత్తుకు ఉపాదాన కారణంగా బ్రహ్మ కాకుండా ఇంకొకటి ఉన్నదని అనడమా? – అనేది ఈ పూర్వపక్షి చేసిన ఆక్షేపం.

దీనికి సమాధానంగా వచ్చిదే, "శ్రుతేస్తు శబ్దమూలత్వాత్" అనే సూత్రం. వేదం చెప్పే విషయాన్ని నమ్మి తీరాలి. వేదం చేత మాత్రమే తెలియబడే పరతత్త్వం, అది ఎటువంటిది అని వేదం తెలియజేస్తున్నదో, అటువంటిదే ఆ పరతత్త్వం అని మనం అంగీకరించి తీరాలి. వేదానికి అంతటి ప్రామాణ్య వైలక్షణం ఉన్నది. దానిని కాదనడానికి లేదు. ఇదే నిర్ణయం. అయితే, ఒకదానితో ఒకటి పొసగకుండా, తర్కానికి లొంగకుండా, వేరు వేరు వేద వాక్యాలు వేరు వేరు అర్థాలను చెప్పినట్లయితే, వానిని అన్ని టినిని సరి అని అంగీకరించడం వీలవుతుందా? అని అంటే, ఆ విధంగా కాదు. అక్కడ పై పైన తోచే వైరుధ్యాలను, ఆపాతతః తోచే తర్కవిరోధాలను జాగ్రత్తగా, లోతుగా ఆలోచిస్తే, సరిచేయడం సాధ్యం అవుతుంది. చక్కగా సాధ్యమవుతుంది. ప్రస్తుత విషయంలో కూడా ఆ విధంగానే సాధ్యమవుతుంది. భగవంతునకు విచిత్ర శక్తి ఉన్నది. తనకు అవయవాలు లేకపోయినా, తాను జగత్తుగా పరిణమించిన తరువాత కూడా, పూర్వం వలె పూర్ణమైన పరతత్త్వంగా నిలచి ఉండే, విచిత్రమైన శక్తిని కలిగినవాడు, అతడు.

దీనిని తిరుమ*ழி*శై ఆళ్వారులు తిరుచ్చంద విరుత్తం అనే ప్రబంధంలో "ఉలగు తన్నొడొన్టి నిఱ్క, వేఱు ని*ற்றி* యాదలాల్, ఉలకిల్ నిన్నై ఉళ్ళ శూ*ழ*ల్ యావర్ ఉళ్ళవల్లరే" ( ఈ జగత్తు అంతా నీకు శరీరమై నీలోనే ఉన్నప్పటికీ, నీవు అసాధారణ దివ్య మంగళ విగ్రహంతో విలక్షణుడవై వేంచేసి ఉన్నావు. అందుచేత లోకంలో నీకు గల ఆశ్చర్యకరమైన ఈ శక్తిని ఎవరు భావించగలరు?) అనే సూక్తి ద్వారా వ్యక్తం చేశారు.

దీనిని వివరించే పెరియ వాచ్చాన్ పిళ్ళై– "జగత్తు నీకు శరీరం కనుక, నిన్ను విడువకుండా ఉండగా, నీవు అసాధారణ విగ్రహాన్ని కలిగినవాడవై, విలక్షణుడవై ఉన్నావు. అంటే, వారు నీ పట్ల విముఖులై ఉండే కాలంలో కూడా, నీవు వారికి ఆత్మవై నిలచి ఉండి, వారి సత్తను రక్షించి, వారు నీకు అనుకూలంగా ఉండే సమయంలో దివ్య

మంగళ రూపాన్ని కలిగినవాడివై ఉంటావు —అని భావం. అందుచేత, ఏ రీతిలోనూ వివేకించి పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కానందున, ఆశ్చర్యకరమైన ప్రకారాలను కలిగిన నిన్ను లోకంలోని పురుషులలో ఎవరు నిన్ను తెలియగలరు?" —అని వివరించారు.

ఇక్కడ ఆళ్వారుల సూక్తిలో "ఒన్రి నిఱ్క" అని అంటే "నీవే లోకం" అనే విధంగా ఒకటిగా ఉండేటప్పుడు —అని అర్థం. "శూ*ఝ*ల్" అనే పదానికి "విచిత్రమైన" అని అర్థం. ఇక్కడ విచిత్రం అంటే—తర్కానికి లొంగని —అని అర్థం కాదు.. లోకంలో ఎన్నో విచిత్రమైన శక్తులను ఎన్నిటినో చూస్తున్నాము. భూమికి, నీటికు లేని, దహించడం అనే విచిత్ర శక్తి అగ్నికి ఉన్నది. ఇదేవిధంగానే, ఒక్కొక్క వస్తువునకు ప్రత్యేకమైన శక్తి ఉండడం ప్రత్యక్ష సిద్ధం. ఆ విధంగానే, పరబ్రహ్మకు ఇటువంటి ఒక విలక్షణమైన శక్తి ఉన్నదని వేదం చెప్పడాన్ని ఒప్పుకోకపోతే తర్కవిరోధం ఏదీ లేదు— అని తరువాత సూత్రంలో పలికి అధికరణాన్ని ముగిస్తున్నారు, సూత్రకారులు.

ప్రస్తుతం మనకి ఆవశ్యకమైనది ఏమి?అంటే— వేదంలో చెప్పినదానిని చెప్పినట్లే అంగీకరించాలి, దాని ప్రామాణ్యంలో సందేహించకూడదు— అనే విషయంలో సూత్రకారులైన బాదరాయణుల దృష్టి బలమైనది— అనేదే. అందుచేత, ఇక్కడ శ్రీభాష్యంలో "శ్రౌతే అర్థే యథాశ్రుతి ప్రతిపత్తవ్యమ్" అని ఉన్నది. వేదంవల్ల తెలిసికొనే వస్తువును, ఆ వేదం దానిని ఏ విధంగా తెలిపిందో, ఆ విధంగానే తెలిసికోవాలి —అని దీని భావం. ప్రమాణాలలో వేదం మొదటి ప్రమాణం కనుక, ఈ నిష్కర్ష చేయబడింది. ఇదే ప్రకరణంలో, శ్రీభాష్యంలో, "శబ్దైకప్రమాణత్వేన సకలేతరవస్తువిసజాతీయత్వాత్ అస్యార్థస్య విచిత్ర శక్తియోగో న విరుధ్యతే" అనే వాక్యంలో "వేదం ఒకటే ప్రమాణంమైన విషయం"— అని చెప్పబడింది. పారలౌకిక పురుషార్థం, దాని ఉపాయాలు – అనే విషయంలో వేదం మాత్రమే మూలప్రమాణం అవుతున్నది.

గౌతమ ధర్మసూత్రగ్రంథం వేద ప్రామాణ్యంతో ఆరంభమవుతున్నది. "వేదోఖిలో ధర్మమూలమ్" అనే వాక్యంతో ఈ గ్రంథం ప్రారంభం అవుతున్నది. ఇందులో "అఖిల" అనే పదం ముఖ్యం. ఈ వ్యాసంలో దీనికి ముందు చెప్పబడని కొత్త విషయం ఇది అని చెప్పవచ్చు. వేదం మొత్తం అంతా ధర్మమూలం. వేదనలో ఏ భాగం కూడా పరిహరించనక్కరలేదు. వేదం, ఋషి వాక్యం, వారి శీలం, తరువాత స్మృతి అనే వరుస క్రమంలో పూర్వ పూర్వప్రామాణ్యం అంగీకరింపబడింది.

"వేదోఖిలో ధర్మమూలమ్, స్మృతి శీలే చ తద్విధామ్, ఆచార శ్చైవ సాధూనామ్" అని గౌతమ మహర్షి అంటున్నారు. మొదట వేదాన్ని పరమప్రమాణంగా అంగీకరించడం, దానిని అనుసరించే మిగిలిన ప్రమాణాలను పలకడం ఇక్కడ గమనించవచ్చు.

ఇక్కడ ఒక సందేహం కలుగుతుంది. వేదం వలెనే స్మృతి, శిష్టాచారం ధర్మానికి ప్రమాణం అయితే, వేదాన్ని మాత్రం ధర్మమూలం అని లోకంలోనివారు వ్యవహరించడం ఎందుకు? అనేది ఆ సందేహం. దానికి సమాధానం ఇది. స్మృతి గ్రంథాలు, పెద్దల ఆచారాలు నేరుగా ప్రమాణాలు కావు. వేదం విధించినదానినే స్మృతి కారులు, శిష్టులు అనుసరిస్తారు –అని మనం అనుమానించి, వాటిని ప్రమాణాలుగా గ్రహిస్తున్నాము. తర్కశాస్త్రాలలోని ఆరంభపాఠాలలో అనుమిత శ్రుతి అని ఒక విచారం చేస్తారు. అది ఇదే. నేరుగా వేద విధి తెలియని సందర్భాలలో మునులు, చక్కని ఆచారాన్ని కలిగిన వైదికులు చూపే మార్గాలనుబట్టి ఊహించే వేద విధులు కూడా ప్రమాణాలు అవుతున్నాయి.

7) వైశేషికసూత్రాలలో కూడా ఇదే విషయం రెండవ, మూడవ సూత్రాలలోనే చెప్పబడింది. "యతోఽభ్యుదయనిశ్శ్రేయససిద్ధిః స ధర్మః" అని, "తద్వచనాదామ్నాయస్య ప్రామాణ్యమ్" అనేవి ఆ సూత్రాలు. వేటివల్ల ఔన్నత్యం, గొప్పతనం కలుగుతుందో, అది ధర్మం,. దానిని పలికేది వేదం. ఆ వేదానికి ప్రామాణ్యం

ఉన్నది –అని వీని అర్థం. సూత్రాలలో సంగ్రహంగానే చెబుతారు.. దానిని రచించిన కణాద మహర్షి ఆరు దర్శనాలలో ఒకటైన వైశేషిక దర్శనానికి మూల పురుషుడు.

8) జైమినీయ మీమాంసా సూత్రాలలో ఒక సూత్రం "వేదం ప్రమాణం కాదు" అనే దానికి ఐదు ఆక్షేపాలు చెప్పబడ్డాయి

ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేన సంబంధః తస్య జ్ఞాన ముపదేశోऽ వ్యతిరేక "శ్చార్థేనుపలబ్ధే తత్ప్రమాణం బాదరాయణస్యానపేక్షిత్వాత్" అనే ఐదవ సూత్రంలో ఈ ఐదు వాదాలు సంగ్రహింపబడ్డాయి.

1) ఇందులో మొదటి వాదం – శబ్దానికి, అర్థానికి సంబంధమనేది వేరు ప్రమాణాలచేతనే ఏర్పడుతున్నది. వేరు ఏ ప్రమాణం లేనప్పుడు "ఈ పదం ఈ అర్థాన్నే సూచిస్తుంది" అనే సంబంధమే ఉండదు. అందుచేత వేదం ధర్మంలో ప్రమాణం కాదు.

2) రెండవ వాదం ఏమంటే –ఆ విధంగా సాధారణంగా శబ్దానికి, అర్థానికి సంబంధం ఉన్నప్పటికీ, వేదంలోని విధివాక్యాల చేత మనకు తెలిసేది ఏదీ లేదు. అర్థప్రతీతియే కలుగదు.

3) మూడవ వాదం ఏమంటే– ఆ విధంగా ఏర్పడినప్పటికీ, "అది సరైనది కాదు" అని తర్వాత బాధింపబడవచ్చు, వేరొక ప్రమాణం చేత అది అడ్డగింపబడిపోవచ్చు.

4) ఇక, నాలుగవ వాదం ఏమంటే –ఆ విధంగా బాధింపబడకుండా ఉన్నప్పటికీ, వేదం చేత మనకు కలిగే ఏ ప్రయోజనం లేదు. ఆ అర్థాలను మనం ఇతర ప్రమాణాల చేత కూడా తెలియవచ్చు. ప్రయోజనం లేనిదానికి ప్రామాణ్యం కూడా అక్కరలేదు.

5) చివరిగా ఐదవ వాదం ఏమంటే –ఆ విధంగా ఏదైనా ఒక ప్రయోజనం ఉన్నప్పటికీ, ఈ వేద ప్రామాణ్యానికి సాక్షి ఏదీ లేదు. అది ఎందుకు ప్రమాణం అవుతున్నది? అని అడిగితే, దానికి వేరే తగిన సాక్షి లేదు.

శ్రీ వేదాంతదేశికులు సేశ్వర మీమాంస అనే గ్రంథంలో ఈ అయిదు వాదాలను ప్రస్తావించి, ఖండించారు.

అసామర్థ్యాత్ అతిదృష్టేః బాధనాత్ అఫలత్వతః,
పరతంత్రతయా వా స్యాత్ అప్రామాణ్యం శ్రుతేర్న తత్.

అని మీమాంసలో ఒక అధికరణంలో నిర్ణయింపబడిన అర్థం సంగ్రహింపబడింది. పైన ప్రస్తావించిన జైమినిసూత్రంలో చెప్పబడిన సమాధానాలు ఈ విధంగా ఉన్నాయి.
1) పదాలతో అర్థాలకు కల సంబంధం అనేది నిత్యమైనది, స్వాభావికమైనది. వేరు ఏ ప్రమాణాన్ని అది అపేక్షించదు. (ఇది "ఔత్పత్తికస్తు శబ్దస్యార్థేన సంబంధః" అనే ఆక్షేపాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పిన మాట).
2) ఇంద్రియాలకు గోచరించని విషయాన్ని కూడా వేద వాక్యాలు బోధించగలవు. వాటి వల్ల మనకు జ్ఞానం తప్పక కలుగుతుంది. ( ఇది "తస్య జ్ఞానమపదేశః" అనే ఆక్షేపాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పినది. )
3) వేదం చేత చెప్పబడిన అర్థాన్ని వేరొక ప్రమాణం చేత ఆక్షేపించడానికి అవకాశం లేదు. ( ఇది "అవ్యతిరేకశ్చ" అనే ఆక్షేపానికి సమాధానం)
4) వేరొక ప్రమాణం చేత తెలియబడని అర్థంలో వేదం ప్రమాణం అవుతున్నది. అందుచేత, "ఇది ఇంతకుముందే వేరు ప్రమాణాల వల్ల తెలియ బడినదే కదా, వేదం కూడా చెబుతున్నది. ఇది నిష్ఫలం కదా అని అనడానికి లేదు. ( ఇది "అర్థేఽనుపలబ్ధేః" అనే ఆక్షేపానికి సమాధానం)

5) దీనికి అన్య ప్రమాణాల సహాయావశ్యకత లేదు. వేదం స్వతంత్రంగానే ప్రమాణం అవుతున్నది. ( ఇది "అనపేక్షిత్వాత్" అనే ఆక్షేపానికి సమాధానం)

ఈ 5 వాదాలను సంగ్రహంగా ఈ విధంగా చెప్పవచ్చు. అసామర్థ్యం, జ్ఞానం కలుగకపోవడం, వేరు ప్రమాణాల చేత బాధింపబడడం, నిరర్థకమై ఉండడం, వేరు ప్రమాణాన్ని సహాయంగా కోరడం –అనేవి ఇవి. ఈ ఐదు కారణాల చేత వేదం అప్రమాణం అని అనడం సరి కాదు. దీని వివరణ మీమాంసా శాస్త్రంలోని ఆరంభంలో గమనించవచ్చు. ఇక్కడ ఇంత మాత్రమే చెప్పబడింది.

అందువల్ల, వేదవాక్యాలలో, అర్థంతో శబ్దానికి ఎల్లప్పుడూ సంబంధం ఉన్నది, జ్ఞానం కూడా వీనివల్ల కలుగుతుంది. అవి అన్య ప్రమాణాల చేత బాధింపబడవు. ఇంద్రియాల వల్ల ఏర్పడని జ్ఞానం వేదం వల్ల కలుగుతుంది. వేదాన్ని సమర్థించడానికి ఇంకొక ప్రమాణం అక్కరలేదు.
ఇటువంటి వేదాన్ని మనం కీర్తిద్దాం.

9) పాతంజలయోగ సూత్రంలో వేద ప్రామాణ్యం, వేద ప్రయోజనం చెప్పబడినవి.

"ప్రత్యక్షానుమానాగమాః ప్రమాణాని" అని, "తపఃస్వాధ్యాయ ప్రణిధానాని క్రియాయోగః" అని అందులో రెండు సూత్రాలు ఉన్నాయి. ఏ విధంగా ఇంద్రియ జన్య జ్ఞానం, అనుమానం ప్రమాణాలుగా ఉన్నాయో, ఆ విధంగానే వేదం కూడా ప్రత్యేకంగా ఒక ప్రమాణం అనేది మొదటి సూత్రంలోని అర్థం. "ఏ విధంగా తపస్సు, జ్ఞానం క్రియాయోగంలో చేరుతాయో, ఆ విధంగానే స్వాధ్యాయం అనబడే యద వేదాభ్యాసం కూడా క్రియాయోగం అవుతుంది" అనేది రెండవ సూత్రంలోని అర్థం.

ఇంతవరకు మనం ఆపస్తంబుడు, గౌతముడు, కణాదుడు, బాదరాయణుడు, జైమిని, పతంజలి అనే సూత్రకారులు ఆరుగురు మహర్షులు ఏకంఠంగా వేద

ప్రామాణ్యాన్ని పలుకుతున్నారు అనే విషయాన్ని, దానిని తమ తమ గ్రంథాల ఆరంభంలోనే ప్రస్తావించి చెప్పారు అనే విషయాన్ని గమనించాము.

10) న్యాయ కుసుమాంజలిలో ఉండే ఒక విషయాన్ని ఇక్కడ ప్రస్తావించాలి. ఈ వ్యాసంలోని 5వ అంశంలో చెప్పిన విధంగా, వేదంలో చెప్పిన విషయాలను తర్కంతో ఎదిరించకుండా, దానిని ఆ విధంగానే అంగీకరించి, తర్కాన్ని, కావాలంటే, సంకోచింప చేసుకోవాలి –అని అంటే, దీనిని తార్కికులు ఏ విధంగా గ్రహిస్తారు? దైవం ఉన్నది– అని సిద్ధించటానికి వేదం మాత్రమే ప్రమాణం అనే విషయాన్ని అంగీకరించకుండా, అనుమానంతో కూడా దైవాన్ని సాధించవచ్చు –అనే తార్కికులలో ముఖ్యమైనవారు ఉదయనాచార్యులు.

వేదానికి, తర్కానికి మధ్య విరోధం ఏర్పడినప్పుడు తార్కికుల అభిప్రాయం ఏమి? అని అడిగితే, ఇది సమాధానం. తార్కికులు కూడా మొదట వైదికులే.. మను స్మృతి గ్రంథంలో ఉండే ఒక శ్లోకాన్ని తమ గ్రంథంలో ప్రమాణంగా ఉదయనాచార్యులు ప్రస్తావించారు. ఆ శ్లోకం ఏమంటే– "ఆర్షం ధర్మోపదేశం చ వేద శాస్త్రావిరోధినా, యః తర్కేణానుసంధత్తే స ధర్మం వేద నేతరః" అనేది ఆ శ్లోకం. "వేదంతో విరుద్ధం కాని తర్కాలతో మాత్రమే ధర్మాన్ని తెలియగలం" అని సంగ్రహంగా ఇందులోని అర్థం. వేదం పరమ ప్రమాణం, తర్కం దానిని అనుసరించవలసినదే.

ఇదే న్యాయ కుసుమాంజలి గ్రంథంలో "కృత్స్న ఏవ హి వేదోఽయమ్" అని ఆరంభించి, వేరొక చోట కూడా వేద ప్రామాణ్యం చెప్పబడింది.

11) శ్రీ భాష్యంలో వేద ప్రామాణ్యం పలు సందర్భాలలో పలు విధాలుగా చెప్పబడింది. ఇంతకు ముందే ఈ వ్యాసంలోని అయిదవ అంశంలో ప్రస్తావింపబడిన శ్రీభాష్యవాక్యాలే కాకుండా, ఇంకా మరి రెండు భాష్యపంక్తులు ఇక్కడ ఉదాహరింపబడుతున్నాయి.

"అత్యంతాతీంద్రియత్వేన ప్రత్యక్షాది ప్రమాణావిషయతయా ప్రమాణం శాస్త్రైకప్రమాణత్వాత్" అన్ని శాస్త్ర యోనిత్వాధికరణంలో ఉండే వాక్యం "పరతత్వాన్ని తెలియడానికి శాస్త్రం ఒక్కటి మాత్రమే ప్రమాణం అవుతున్నది, వేరు ఏ ప్రమాణం లేదు" అని తెలుపుతున్నది.

వేరొక చోట "అతో౽తీంద్రియార్థే శాస్త్రమేవ ప్రమాణమ్, తదుపబృంహణాయైవ తర్క ఉపాదేయః" అనే వాక్యం ఉన్నది. "ఇంద్రియాలకు అందని వస్తువు విషయంలో శాస్త్రం మాత్రమే ప్రమాణం అవుతున్నది, దానిని వివరించడం కోసం మాత్రమే తర్కం ఉపయోగపడుతుంది" అని దీని అర్థం. ఇది విలక్షణత్వాధికరణంలో ఉన్నది.

12) మీమాంసా శాస్త్రంలో ధర్మం అనేదానికి ఏమి లక్షణం చెప్పబడింది? అనే గమనిస్తే, అందులో కూడా వేద ప్రామాణ్యమే స్పష్టమవుతుంది. ప్రధాన శతకంలో వేదాంతదేశికులు పారలౌకిక పురుషార్థోపాయం అని పలికిన సూక్తియే ధర్మ లక్షణం. పదవ్యుత్పత్తిని బట్టి గమనిస్తే, ఏది లోకగతిని ధరిస్తున్నదో అదే ధర్మం అయితే అర్థ సంగ్రహంలో "వేదప్రతిపాద్య ప్రయోజనవదర్థో ధర్మః" అని చెప్పబడింది. ధర్మానికి లక్షణం చెప్పేటప్పుడు వేదం తప్పక ప్రసమవుతుంది. శ్రేయస్సాధనం ధర్మమని కానీ, "ధ్రియతే అనేన" అని కానీ, ఈ రెండిటిలో రానిని ధర్మానికి లక్షణంగా చెప్పి, దానికి తరవాత, ఆపస్తంబ మహర్షి వలెనో, లేక, గౌతమ మహర్షి వలెనో ధర్మానికి మూల ప్రమాణం వేదం అని చెప్పి ఉండవచ్చు. ఆ విధంగా చెప్పకుండా, మీమాంసా కారులు ఒక విధంగా ఇంకొంచెం ముందుకు పోయి, వేదంలో ఏమేమి చేయమని ఆజ్ఞాపింపబడుతున్నదో అది అంతా ధర్మం అని లక్షణమే చెప్పారు. దీనికి వారి సూత్రం మూలంగా అవుతున్నది. సూత్రంలో వేదం అని కానీ, శ్రుతి అని గాని పదం లేకపోయినా, అందులో చెప్పబడిన చోదనా అనేది శ్రుతిచోదనయే అనే విషయం నిర్వివాదంగా ఉన్నది.. మీమాంసా పాదుకలో "ధర్మం సూత్రే ద్వితీయే నను పరిపఠితం చోదనా లక్షణార్థః" అని ఈ లక్షణం చూపబడింది. ఆ వేదంలో విధింపబడిన కార్యాలకే ధర్మకార్యం అని వీరు పేరు పెట్టారు.

ఇందువల్ల ప్రత్యేకంగా వేదం ధర్మానికి మూల ప్రమాణం అని చెప్పవలసిన అవసరం లేకుండా పోయింది. ఈ విధంగా చెప్పిన లక్షణం లోకంలో కూడా ప్రసిద్ధమైనందున నిఘంటు కారులు కూడా దానిని అంగీకరించారు. ఉదాహరణకు అమరసింహుని నామలింగానుశాసనంలో "శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయః త్రయీ ధర్మస్తు తద్విధిః" అని చెప్పబడింది అని పేరు ఉన్నదట. దీనిని చెపే అమరసింహుడు వేద ప్రామాణ్యాన్ని అంగీకరించని మతానికి చెందినవాడై ఉన్నప్పటికీ, అతడు ఈ విధంగా చెప్పడానికి కారణం ఏమి? అంటే, మన దేశంలో ఆ అవధికి వేరూనుకొని పోయింది, వేదప్రామాణ్యం అని భావం.

13) మహాభాష్యంలో పతంజలి ముని చాలా అందంగా వివరిస్తారు ఈ విషయంలో ఏమని చెప్పారు అని చూస్తే, "నైవం ఈశ్వర ఆజ్ఞాపయతి ౦, నాపి వేదేఽష్వ్యేమనామః" – భగవంతుని ఆజ్ఞ లేదు, వేదాలలోను ఏదీ లేదు చెప్పబడలేదు. ఆ విధంగా అయినపుడు, మనం ఎందుకు వేద ప్రామాణ్యాన్ని అంగీకరించాలి? అనే వాదాన్ని నిరాకరిస్తున్నారు. మనకు వేదవాక్యం, భగవంతుని ఆజ్ఞ ఒకటే, ఇవి తప్ప వేరు ఏదీ అంగీకరించేటట్లుగా మనలను నిర్బంధించలేదు, "శబ్ద ప్రమాణకా వయం, యత్ శబ్ద ఆహ తత్ అస్మాకం ప్రమాణమ్" అని పతంజలి ఇంకొక చోట ఈ అర్థాన్ని స్పష్టంగానే చెప్పారు. ఇక్కడ ఇంకా పలు చోట్ల శబ్దం అనే పదానికి వేదమని అర్థం సర్వ సమ్మతమైనది. ఈ వాక్యానికి అర్థం చెప్పడంలో వివాదం లేదు. ఏది వేదం చెబుతున్నదో అది అంతా సత్యం– అని అర్థం.

ఈ విధంగా న్యాయం, మీమాంస, వ్యాకరణం, వేదాంతం అనే నాలుగు శాస్త్రాలలోను వేదం యొక్క ప్రామాణ్యం స్పష్టంగా చెప్పబడింది. ఈ నాలుగింటిని చేర్చి చతుకశాస్త్రాలు అని మనం వ్యవహరిస్తున్నాము. ఈ నాలుగింటికి ఈ విషయంలో ఐకమత్యం ఉన్నది.

14) శ్రీరామాయణంలో వేద ప్రామాణాన్ని గూర్చి మన మనసులో చక్కగా నిలిచేటట్లు వాల్మీకి మహర్షి తెలుపగోరారు. ఆ కథలో నేరుగా చెప్పడానికి వారికి సందర్భం ఏర్పడలేదు, అయినా, వారు విడవలేదు. కవీశ్వరులకు తమ భావాలను కథలో చెప్పడానికి ఎన్నో దారులు ఉన్నాయి. సీతను రావణుడు అపహరించుకొని వెళ్లేటపుడు ఒక దృష్టాంతంగా ఈ అంశాన్ని కథలో ప్రవేశపెట్టారు, కవి. రావణునితో పోరాడి జటాయువు అతనిని అడ్డుకున్నప్పుడు, ఆ జటాయువు పలికే వాక్యంగా ఈ శ్లోకం కనిపిస్తున్నది.

"న శక్తః త్వం బలాత్కర్తుం వైదేహీం మమ పశ్యతః,
హేతుభిః న్యాయసంయుక్తైః ధ్రువాం వేదశ్రుతీమివ".

నిశ్చయమైన వేదార్థాన్ని వాదాలతో బలాత్కారంగా ఏ విధంగా బహిష్కరించడం సాధ్యం కాదో, ఆ విధంగానే, సీతను రావణుడు జటాయువుసమక్షంలో అపహరించడం సాధ్యం కాదు –అని దీని భావం. నిశ్చయమైన వేదస్థితివంటిది, సీత. అర్థం నిశ్చయింపబడిన వేదవాక్యార్థాన్ని బలాత్కారంగా మార్చి, వేరొక అర్థాన్ని చెప్పాలని ప్రయత్నించే పేతువాదం వలె, వేరొక ప్రమాణం వలె, రావణుడున్నాడు. ఆమెను అతడు ఎంతగా బెదిరించినా, హింసించినా, తన మార్గాన్ని విడువకుండా రావణుని దారికి రాకుండా సీత ఉండేటట్లే, ఎంతగా హేతువులను, ఎంతగా యుక్తులను ప్రయోగించి, పూర్తిబలంతో ప్రయత్నించి మర్దించినా, ఏమాత్రం మార్పు లేకుండా నిశ్చయంగా ఉంటుంది, వేదార్థం. మిగిలిన ప్రమాణాలు అన్నీ కలిసి వేదం అనే ప్రమాణాన్ని బలంగా ఆకర్షించి, దాని అర్థాన్ని మార్చడం వాటికి వీలు కాని పని.. వేదానికి ఉండే ప్రామాణ్యం ఆ అవధికి స్థిరంగా ఉంటుంది. అయితే, మరి, ఎందుకోసం వేదవాక్యాలను కూడా యుక్తులను ఉపయోగించి పెద్దలు విచారాన్ని చేస్తున్నారు? అంటే, "ధ్రువామ్" అనే పదంలో దీనికి బదులును కవి సూచించారు. వేదవాక్యాలకు ఏ విధంగా అర్థం చెప్పవచ్చు? అనే విషయంలో మాత్రమే న్యాయ విచారాలు చేయబడతాయి. నిర్ణయం చేసిన వేదార్థం విషయంలో, దానిని అప్రమాణమని

తిరస్కరించవచ్చునా? తిరస్కరించకూడదా? అని అంటూ పెద్దలు ఎపుడూ వాదవిచారాలను చేయరు.

15) మహాభారతంలో వేదమే ఉన్నతమైన శాస్త్రం అని తెలియజేసే శ్లోకం ఒకటి ఉన్నది. ఆ శ్లోకంలోని సూక్తిని గమనిస్తే, వ్యాసమహర్షి తీర్మానం ఎటువంటిదో మనకు స్ఫుటపడుతుంది.

"సత్యం సత్యం పునః సత్యమ్ ఉద్ధృత్య భుజముచ్యతే,
వేదాత్ శాస్త్రం పరం నాస్తి న దైవం కేశవాత్పరమ్"

అనేది ఆ సూక్తి.

మూడుసార్లు ప్రమాణం చేసి, భుజాలను పైకి ఎత్తి నిశ్చయంగా వ్యాసులు చెప్పే విషయాలు రెండు. అందులో మొదటిది –వేదం కంటే ఉన్నతమైన శాస్త్రం ఇంకొకటి లేదు– అనేది. రెండవ విషయం ఏమంటే–కేశవుని కంటే గొప్పదైవం లేదు– అనేది. అందుచేత మిగిలిన శాస్త్రాల కంటే వేదం ప్రధానమైనది –అని స్థిరంగా వ్యాసులు ఇక్కడ తెలుపుతున్నారు. మన పెద్దలకు ఈ శ్లోకాన్ని ప్రతి దినం సహస్రనామానికి తరువాత అనుసంధించే అలవాటు ఉన్నది.

16) నహుషోపాఖ్యానంలో ఇదే అర్థాన్ని ఒక కథ మూలంగా తెలుపుతున్నారు, వ్యాసమహర్షి. ఇది కూడా మహాభారతంలోనే ఉన్నది. వేదమంత్రాలను కొన్నిటిని పలికి, "ఇవి ప్రమాణం అవుతాయా? కాదా?"అని ఇంద్రుని స్థానంలో ఉండే నహుషుని దగ్గర ఋషులు ప్రశ్నించారట.

"ఏతే ప్రమాణం భవత ఉతాహో నేతి వాసవ!,
నహుషో నేతి తానాహ సహసా మూఢచేతనః"

అనే మహాభారత శ్లోకం ఇది. ఆ మంత్రాలు ప్రమాణాలు కావు –అని తెలియకుండానే, ఆలోచించకుండానే నహుషుడు బదులు పలికాడట. అతడు

మూఢచేతనుడై, ఏదో మోహంవల్ల, బుద్ధిలోని కాలుష్యం వల్ల ఆ విధంగా చెప్పాడు. ఆలోచించి, జ్ఞానంతో పరిశీలించి పలికి ఉంటే, వేదమంత్రాలు ప్రమాణంగా గ్రహించదగినవి అని సరిగా చెప్పి ఉంటాడు. అయితే, అతని అదృష్టం సరిగా లేని వేళ అది. చటుక్కున తప్పైన సమాధానాన్ని చెప్పాడు. దాని ఫలితం ఏమీ తెలుసునా? అతడు సర్పరూపాన్ని పొందవలసి వచ్చింది. ఇంద్ర పదవిలో ఉండే నహుషునకు కూడా వేదమంత్రాల ప్రామాణ్యాన్ని అంగీకరించనందున కఠినమైన శిక్ష కలిగింది.

17) సనత్సు జాతీయం అనే ప్రసిద్ధమైన ఒక భాగం మహాభారతంలో ఉన్నది.

యదేతదత్ర భగవాన్ స నిత్యం–- తదర్థయోగే చ భవంతి వేదాః" అని భగవంతుని సృష్టిగూర్చి వేదమే ప్రమాణం అని అందులో వ్యాసులు పలికారు.

"నిర్దిశ్య సమ్యక్ ప్రభవంతి వేదాః" అనే వాక్యం, "యోవేద వేదాన్ స చ వేద వేద్యమ్" అనే వాక్యం అక్కడే ఉన్నాయి. వేదాన్ని ఎవడు తెలుసుకుంటున్నాడో, అతడే తెలియవలసినదానిని అంతటినీ తెలుసుకుంటున్నాడు, అంతేకాక, వేదాలు తమ అర్థాలను ఋజువుగా తెలుపుతున్నాయి—అని అక్కడ చెప్పబడింది.

18) మనుస్మృతిలో వేదాన్ని పరమ ప్రమాణంగా మనువు ఒక సూక్తిలో పలుకుతున్నారు.

"ధర్మం జిజ్ఞాసమానానామ్ ప్రమాణం పరమం శ్రుతిః" అని అందులో ఉన్నది. ధర్మాన్ని తెలియాలని అనుకున్నవారికి చాలా ఉన్నతమైన ప్రమాణం వేదమే— అని దీని అర్థం. పరమ ప్రమాణం అంటే— దీనికి మించిన ప్రమాణం ఇంకొకటి ఏదీ లేదు —అని అర్థం. ఏదైనా ఒక వివాదం ఏర్పడితే, ఆ విషయంలో వేదం తెలిపిన తీర్పుకు మించిన తీర్పు ఏది ఉండదు. ఇంతే కాక, వేదానికి బాహ్యమైన స్మృతులను

బహిష్కరించాలి—అనే పలికి, వేదం కంటె ఇతరమైన మిగిలిన గ్రంథాలకు ఉండే ప్రామాణ్యం ఆ వేదం పెట్టిన భిక్షయే— అని కూడా ఆ మనువు తెలియజేశారు.

"యా వేదబాహ్యాః స్మృతయః యా శ్చ కా శ్చ కుదృష్టయః,
సర్వా స్తా నిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠా హి తాః స్మృతాః"

స్మృతులన్నీ ప్రమాణాలు కావు. వాటిలో కొన్ని వేదానికి విరుద్ధమైనవి, తగని దృష్టిని కలిగినవి. ప్రయోజనం లేనివి. తమో గుణంలో నిష్ఠను కలిగినవి—అని అంటూ ఈ విధంగా శరపరంపరగా దూషణాలను వర్షించారు, మనువు. ఒక స్మృతి గ్రంథమే ఈ విధంగా కొన్ని విపరీత స్మృతి గ్రంథాలను దూషించడం గమనించదగినది. అన్ని ప్రాచీన గ్రంథాలు మంచివి అని మనం అంగీకరించకూడదు. ఇందుకోసం మనలను హెచ్చరిస్తున్నారు, మనువు. వేదాన్ని అనుసరించిన స్మృతులను మాత్రమే ప్రమాణంగా మనం అంగీకరిస్తాము.

"విరోధే త్వనపేక్ష్యం స్యాత్" అనే మీమాంసా సూత్రంలో కూడా ఇదే అర్థం చెప్పబడింది. వేదంతో విరోధించే స్మృతిభాగాలను అక్కరలేదని మనం బహిష్కరించాలి. మనుస్మృతి, గౌతమ ధర్మ సూత్రం అనేవి అన్ని ప్రమాణం కావడానికి కారణం అవి వేదాన్ని అనుసరించడం వల్లనే. వేదానికి విరుద్ధంగా ఏ స్మృతి చెప్పినప్పటికీ అది ప్రమాణం కాబోదు. "సంవాదే మానవాదే స్మృతిభి రవిరలే" అని ఆరంభించే తత్వముక్తా కలాప శ్లోకం కూడా దీనిని వివరిస్తున్నది.

ఇదే మనుస్మృతి వేరొక మార్గంలో కూడా మనకు వేదప్రామాణ్యాన్ని తెలుపుతున్నది. వేదానికి వేదం అనే పేరు ఎందుకు వచ్చింది? దీనికి సమాధానం తెలిపే శ్లోకం ఏమంటే—
ప్రత్యక్షేణానుమిత్యా వా యస్తూపాయో న బుధ్యతే,

ఏతం విదంతి వేదేన తస్మాత్ వేదస్య వేదతా"

వేదమనే శబ్దానికి అర్థం ఏమంటే– మిగిలిన ప్రమాణాల వల్ల తెలియని విషయాన్ని తెలుపగలిగినది–అని. "తెలియడం" అనే అర్థం ఇచ్చే "విద్" అనే ధాతువు నుండి ఈ వేదం అనే పదం పుట్టింది. దీనివల్లకూడా అది చాలా గొప్పది –అని తెలుస్తున్నది.

19) విష్ణు ధర్మంలో ఉండే ఒక వాక్యం గమనించదగినది. "వేదాః ప్రమాణం" అనే ఒక వాక్యం అందులో ఉన్నది. ఒక వాక్యాన్ని బహువచనంతో ఆరంభించి ఏక వచనంతో ముగించడం లక్షణ దోషం కదా! వేదం ప్రమాణం –అని కానీ, వేదాలు ప్రమాణాలు –అని కానీ చెప్పి ఉంటే సరిగా ఉండేదికదా!– అనే ఒక సందేహం ఇక్కడ కలుగుతుంది. వేదాలు ప్రమాణం అనే వాక్యంకూడా లక్షణ దృష్టిలో సరి అయినదే–అనే ఒక శాస్త్రక్రమం ఇందులో ఇమిడి ఉన్నది. వేదాలు అనేకం అయినా, అవి అన్నీ చేరి ఒకే ప్రమాణం అవుతున్నవి –అని ఇక్కడ అర్థం.

20) ఆంగిరసస్మృతిలో తనను ప్రశ్నించిన బ్రాహ్మణులకు ఆంగిరస మహర్షి ధర్మాలను నేర్పించేటప్పుడు మొదట చెప్పినది ఇదే. వేదంలో అనుష్ఠించమని చెప్పిన కార్యాలను చేయడమే ధర్మం– అని ఆయన అంటున్నారు. లోక రీతిలో ఇంకా కొన్నిటికి కూడా ధర్మకార్యాలు అనే పేరు ఉండడం ఒప్పుకున్నప్పటికీ, అది రెండవ పక్షమైన ఉపచార వ్యవహారమే. ధర్మాలు అని వేదంలో చెప్పబడినవి మాత్రమే ముఖ్యమైన ధర్మాలు అని విభాగించి ఆ ముని పలికారు.

"ధర్మః స్యాత్ చోదనాప్రోక్తః తదన్యస్తూపచారకః,
లిజాదిరూపా సా జ్ఞేయా ముక్తిదా శ్రుతిచోదితా" అనేది అక్కడ ఉండే శ్లోకం.

21) దేవి భాగవతంలో ధర్మమార్గానికి వేదమే ప్రమాణం –అనే విషయం చక్కగా స్పష్టంగా ఉన్నది

సర్వదా వేద ఏవాసౌ ధర్మమార్గ ప్రమాణకః,
తేనావిరుద్ధం యత్కించిత్ తత్ ప్రమాణం న చాన్యథా" అనే శ్లోకం అందులో ఉన్నది

ఇందులో "సర్వథా" అనే పదానికి అన్ని విధాలుగా, ఏ విధంగా అయినా –అని అర్థం. ధర్మమార్గానికి వేదం ప్రమాణం కావడం అనేది అన్ని విధాలుగాను– అని భావం. వేదప్రామాణ్యాన్ని అంతటి అవధిలో స్పష్టంగా ఇది పలుకుతున్నది. శ్లోకంలోని ఉత్తరభాగంలోని అర్థం ఏమంటే– వేదంతో విరుద్ధం కానిది ప్రమాణం అవుతున్నది. విరుద్ధంగా ఉన్నది కాదు–అని.

22) సూత సంహితలో ఉన్నది అని ఇంకొక పుస్తకంలోనుండి ఈ క్రింది శ్లోకం తెలియవస్తున్నది.

"అతీంద్రియార్థవిజ్ఞానే మానం నః శ్రుతిరేవ హి,
శ్రుత్యేకగమ్యే సూక్ష్మార్థే స తర్కః కిం కరిష్యతి?"

దీని తాత్పర్య ఏమంటే– కొన్ని అర్థాలు అతీంద్రియాలు, అంటే, ఇంద్రియాలకు గోచరం కానివి. వాటిని తెలియడంలో మనకు ప్రమాణంగా ఉండేది వేదం మాత్రమే. వేదం వల్ల మాత్రమే తెలియదగిన సూక్ష్మమైన అర్థంలో ఆ తర్కం ఏమి చేయగలదు–అని.

కన్ను, చెవులు మొదలైన ఇంద్రియాలకు తెలియని విషయంలో తర్కం అర్థం తెలుపకుండా ఉంటుందా? తర్కవిరుద్ధమైన అర్థాన్ని వేదం చెప్పినా, దానిని మనం అంగీకరించవచ్చునా? అని ఈ విధంగా మనం భావించవచ్చు. అయితే, తర్కం కూడా

మనసు అనే ఇంద్రియాలకు సాక్షాత్తుగా అందే వస్తువు విషయంలో మాత్రమే వర్తిస్తుంది. దైవం, స్వర్గం, నరకం, ధర్మం, అధర్మం –అనే ఇవి అన్ని మనస్సుకు కూడా వేదం ద్వారానే అందుతున్నవి. మనస్సు కూడా ఒక ఇంద్రియమే. ఇది అంతరింద్రియం. ఏ ఇంద్రియానికీ అందని వస్తువులను వేదం తెలియజేస్తున్నది. వేదం మాత్రమే తెలియజేసే విషయంలో తర్కం ప్రవర్తించదు. ఈ అర్థాన్ని బలపరచడం కోసం ఇక్కడ ఏవ, హి, ఏక, సూక్ష్మ, కిమ్ –అనే పదాలను ఈ ప్రమాణ వచనం ఉపయోగించింది. వేదం మాత్రమే ప్రమాణం. ఇది ప్రసిద్ధమైన విషయం. వేదంమాత్రమే తెలిపే సూక్ష్మమైన అర్థం ఇది. ఇక్కడ తర్కం ఏమి చేస్తుంది? అని ఈ విధంగా పలికి, ఈ శ్లోకంలో తెలియజేసే అర్ధంలో దార్ఢ్యం సూచింపబడింది.

ముగ్గురు అళ్వార్ల సూక్తులు, ఆరుగురు సూత్రకారులు, నాలుగు శాస్త్రాలు, రెండు ఇతిహాసాలలోని కథలు, ఇంకా, ఏడు స్మృతీతిహాస పురాణ ప్రమాణాలు –అనే వీటిని ఇంతవరకు నిరూపించడం జరిగింది. ఇక, భగవద్రామానుజుల నుండి ఆరంభించి, వేదాంత దేశికులకు ముందున్న ఆచార్యుల సూక్తులను కూడా గమనిద్దాం. భగవద్రామానుజులు, కూరేశులు, షభట్టర్, నడాదూర్ అమ్మాళ్ – అనే వీరు వేద ప్రామాణ్యాన్ని తెలిపే రీతిని గమనిద్దాం.

23) భగవద్రామానుజులు వేదార్థ సంగ్రహంలో వేద ప్రామాణ్యాన్ని తెలియజేసేటప్పుడు “ప్రామాణ్యం చ వేదానామ్ ఔత్పత్తికస్తు శబ్దార్ధసంబంధ ఇత్యుక్తమ్” అని అంటూ జైమిని అభిప్రాయాన్ని ఆదరంగా ప్రస్తావించారు.

24) శ్రీవైకుంఠస్తవంలో వేదాలే గొప్ప ప్రమాణాలు అనే విషయాన్ని చెప్పడం కోసం ఒక పూర్తి శ్లోకాన్నే కూరేశులు అనుగ్రహించారు.

ఆజ్ఞా తవాత్ర భవతీ విదితా త్రయీ సా

తాం హి ప్రమాణ మధిజగ్ము రతీంద్రియార్థే,
ఆభాసభూయ మభియాంత్యపరాణి దోషైః
ఏషాతు దోషరహితా మహితా పురాణీ"

అనేది ఆ శ్లోకం. ఇందులో వేద ప్రామాణ్యాన్ని గూర్చి ఏడు అర్థాలు వరుసగా అంతర్భవించి ఉన్నాయి. అందులో మొదటిది– వేదం భగవంతుని ఆజ్ఞ అనేది. రెండవది– వేదం గొప్ప అతిశయాన్ని కలిగినది అనేది. మూడవది. వేదం ( ఋగ్వేద, యజుర్వేద, సామవేధాలు అనే మూడు విధాలైన విభాగాలతో కూడినదై అయినందున) త్రయీ అనే పేరుతో ప్రసిద్ధమైనది అనేది. నాలుగవ అర్థం –ఇంద్రియాలకు అందని విషయాలలో వేదం ప్రమాణం అవుతున్నది అనేది. ఇక్కడ హి అనే పదంచేత వేదం ఒకటే ప్రమాణం అనేది కూడా చెప్పబడింది. ఐదవ అర్థం –వేరు ప్రమాణాలు వాస్తవంలో ప్రమాణాభాసాలు, దోషాలతో నిండినవి అనేది. ఆరవ అర్థం– వేదం నిర్దోషమైనది, మహితమైనది అనేది. ఏడవ అర్థం– వేదం ప్రాచీనమైనది అనేది. వీటిలో కొన్ని వేద ప్రామాణ్యాన్ని నిరోపించేవి, ఇంకా కొన్ని దానికి తగిన కారణాలను తెలియజేసేవి.

25) భట్టర్ అనుగ్రహించిన నంబెరుమాళ్ తిరుమంజన కట్టియమ్ లో ఉండే ఒక శ్లోకం– "త్వం మేఽహం మే కుతస్తత్ తదపి కుతః వేదమూలప్రమాణాత్" అని ఆరంభం అవుతున్నది. పలు ఆలయాలలో భగవంతుని అభిషేక సమయంలో ఈనాటికీ ఇది అనుసంధింపబడుతున్నందున చాలా ప్రసిద్ధమైనది. ఇందులో జీవునకు, భగవంతుడు మధ్య సంభాషణ జరిగినట్లు ఉత్ప్రేక్షించి, వర్ణింపబడుతున్నది.

"నీవు నాకు సొత్తు" అని భగవంతుడు పలికినట్లు, దానిని నిరాకరిస్తూ జీవుడు "నేను నాకే సొంతం" అని వాదం చేసినట్లు, ఈ విషయంలో ఏమి సాక్షి అనే విషయాన్ని తీర్మానించడం కోసం సాక్షులను వెదకినట్లు, వేదమూల ప్రమాణం అనేది భగవంతుడు అనే వాదికి, అనుభవసాక్షి అనేది బద్ధజీవుడనే ప్రతివాదికి ఋజువులుగా పలికినట్లు ఈ సంభాషణ ఆరంభమవుతున్నది. ఇందులో జీవునకు తెలిసేటట్లు వేదమూల

ప్రామాణ్యాన్ని భగవంతుడు పలుకుతున్నాడు. ఈ వేద మూల ప్రమాణం అనే పదానికి మూడు విధాలుగా అర్థాన్ని చెబుతారు. వేదం అనే మూల ప్రమాణం అనేది మొదటి అర్థం. వేదాన్ని మూలంగా కల "దాసభూతాః స్వతః సర్వే హ్యాత్మానః పరమాత్మనః" అనే మొదలైన ప్రమాణాలు మూల ప్రమాణాలు అని అనవచ్చు. వేదమూలం అని ప్రణవార్థానికి పేరు. ఇది "యా మూలమామ్నాయ" అని మొదలైన సూక్తులలో ఈ విషయం చెప్పబడినది. ఈ ప్రణవంలో –అకారవాచుడైన భగవంతునికే మకారంచేత చెప్పబడే జీవాత్మ శేషం –అనే అర్థం లభిస్తున్నందున ఇది అప్పుడు ఋజువు అవుతున్నది. భట్టర్ గొప్ప కవి అయినందున వేదాలలో, స్మృతులలో, మంత్రార్థరహస్య గ్రంథాలలో ఈ అర్థం తెలియడాన్ని సంగ్రహించి, ఒకే పదంలో "వేద మూల ప్రమాణాత్" అని అన్నారు. వేదమనే మూల ప్రమాణం, వేదాన్ని మూలంగా కల ప్రమాణం వేద మూలమనే ఒక ప్రమాణం–అని మూడు అర్థాలు ఇక్కడ వేద మూల ప్రమాణం అనే పదానికి లభించాయి. ఈ రీతిలో మూడు విధాలుగా వేదప్రామాణ్యంలోని ఉత్కర్షం తెలుపబడింది. భగవంతుడు పలికిన ఈ ప్రమాణాన్ని ప్రతివాది కూడా కాదనలేదు. ఇది సరైన ఋజువు అయినందున, నా అనుభవసాక్షి కారణంగా నేను నాకు చెందినవాడనని అంటున్నాను –అని మాత్రమే వాదించాడు. ఈ విధంగా భట్టర్ సంభాషణను పలికి, వేద ప్రామాణ్యాన్ని ఈ శ్లోకంలో దృఢపరచారు.

26)పరాశరభట్టర్ శ్రీరంగరాజస్తవం ఉత్తర శతకంలో వరుసగా ఐదు శ్లోకాలలో వేదానికి కల గొప్పతనాన్ని ప్రస్తావించారు. వాటిలో, వేద ప్రామాణ్యాన్ని కీర్తించే శ్లోకం కూడా ఒకటి ఉన్నది. "ఆదౌ వేదాః ప్రమాణం స్మృతి రుపకురుతే" అని ఒక శ్లోకం ఆరంభం అవుతున్నది. ఇక్కడ మొదట వేదాలు ప్రమాణం–అని అంటున్నారే. మొదట అని అంటే ఏమి తాత్పర్యం? జగత్సృష్టి యొక్క ఆరంభంలో వేదోపదేశం భగవంతునిచే బ్రహ్మకు చేయబడినందున, ప్రత్యక్షాది ప్రమాణాల కంటే మొదటిది వేద ప్రమాణం అని ఒక అర్థాన్ని ఇక్కడ చెప్పవచ్చు. లేక, ఎన్నో విషయాలలో వేదం మూల ప్రమాణమై ఉన్నది, స్మృతి మొదలైనవి ఆ మూల ప్రమాణాన్ని తెలుసుకోవడంలో ఉపయోగపడుతున్నాయి అనే అర్థం కూడా చెప్పవచ్చు. ఆ శ్రీరంగరాజస్తవం ఉత్తర

శతకంలోనే "వేదే కర్త్రాద్యభావాత్" అని ఆరంభమయ్యే శ్లోకంలో "తన్మూలత్వేన మానం తదితర దఖిలం జాయతే రంగధామన్" అనే రెండవ పాదం ఉన్నది. మిగిలిన శాస్త్రాలకు కలిగే ప్రామాణ్యం వేదమూలం కనుక వాల్మీకి రామాయణం ప్రమాణం అవుతున్నది. "వేదః ప్రాచేతసాత్ ఆసీత్ సాక్షాత్ రామాయణాత్మనా" అనే విధంగా అది వేదం యొక్క రూపాంతరం కనుక. పంచరాత్రం ప్రమాణం కావడం ఎందువల్ల ?అని అంటే, అది వేదాన్ని అనుసరించి ఉన్నందున అనే పలికి వివరించినందున. అయితే మరి, కపిలస్మృతి ప్రమాణం కాకపోవడమేమి? అని అంటే, అది భగవంతుని గూర్చి వేదం తెలియజేసిన అర్ధాలకు వ్యతిరేకంగా ఉండడం వల్లనే. సంగ్రహంగా చెప్పాలంటే, అన్య గ్రంథాలకు ప్రామాణ్య హేతువు అవుతున్నది, వేదం అనే మూల ప్రమాణం. ఈ విధంగా వేదమే మూలప్రమాణమై ఉండడం మాత్రమే కాక, మిగిలిన గ్రంథాలకు ప్రామాణ్యాన్ని కలిగిస్తున్నది. అదే శ్రీరంగ రాజస్తవంలో "వేదా ప్రమానం తతః "అని ఒక శ్లోకం పూర్తి అవుతున్నది. ఈ శ్లోకంలో– వేదం యొక్క నిత్యత్వం, అపౌరుషేయత్వం దాని ప్రామాణ్యానికి కారణాలు అని అంటున్నారు, భట్టర్. ఇది భట్టర్ కు ముందున్నవారు పలికిన అర్థమే. వాచస్పతిమిశ్రులు అనే మహా పండితులు అద్వైత అయినప్పటికీ వారి సూక్తులను మన పూర్వాచార్యులు అంగీకరించారు. "యది న నిత్యాదిగతం ప్రమాణమ్" అనే ఆరంభం అవుతున్న వాక్యంలో వారు నిత్యత్వం, అపౌరుషత్వం వేదప్రామాణ్యానికి సాధనంగా ఉండడాన్ని వివరించారు. ఆ విధంగానే ఇక్కడ భట్టర్ కూడా ఈ శ్లోకంలో పలుకుతున్నారు.

27) కైశిక పురాణవ్యాఖ్యానంలో అవతారికా భాగంలోనే వేద ప్రామాణ్యం ప్రస్తావింపబడింది. పరాశరభట్టర్ అనుగ్రహించిన ఈ గొప్ప గ్రంథం ఆలయాలలో కైశిక ఏకాదశి నాడు ఈనాటికీ భగవంతుని ముందు పారాయణం చేయడం వల్ల ప్రసిద్ధమైనది. ఇప్పుడు ప్రమాణంగా చూపబోయే వాక్యాలు ఆ గ్రంథంలోనివే.

"వేదోఖిలో ధర్మమూలమ్" అని, "పితృదేవో మనుష్యాణాం వేదః చక్షుః సనాతనమ్" అని చెప్పే విధంగా అతీంద్రియాలైన తత్వహిత పురుషార్థాలలో ప్రమాణ భూతాలైన

వేదాలకు పరికరభూతాలైన విద్యా స్థానాలు "అని ఆ వ్యాఖ్యానంలో చెప్పబడింది. మన ఇంద్రియాలకు అందనివి చాలా ఉంటాయి. భగవంతుడనే తత్వం, ధర్మ మార్గం అనే హితం, మోక్షకైంకర్యఇ అనే పురుషార్థం, ఇంకా అనేకమైన విషయాలు ఇందులో అంతర్భవిస్తాయి. వీటికి అన్నిటికి ప్రమాణమై ఉండేది వేదమే. మిగిలిన శాస్త్రాలు వేదానికి పరికరంగా ఉండేవి– అని ఇక్కడ భట్టర్ వివరించారు. "పారలౌకిక పురుషార్థ తదుపాయాలు" అని వేదాంతదేశికుల ప్రధాన శతకంలోని వాక్యం చెప్పే విషయం కూడా ఈ అర్థాన్నే.

28) శ్రీ గుణరత్నకోశంలో లక్ష్మీ కటాక్షం లేనివారు పలికే జల్పాలను గురించి పలికేటప్పుడు మొట్టమొదటిలోనే "ఆహుః వేదాన్ అమానం కతిచన" అని అన్నారు భట్టర్. వేదాలు ప్రమాణం కావు అనేది వారు చేసే పెద్ద జల్పం. జడుల తలాతలి అని అన్నా దైవం లేదు అనే నాస్తిక వాదం కూడా దీనికి బాహ్యమే.
ఇక్కడ ఒక చిన్న చర్చ.. నాస్తికుడు ఎవరు? ఆస్తికుడెవరు? అనే విషయంలో నాలుగు విధాలైన అభిప్రాయాలు వ్యాపించి ఉన్నాయి.

1) వేదం ప్రమాణం, దాని ప్రకారం భగవంతుడు ఉన్నాడు అనేది మన సంప్రదాయంలో అభిప్రాయం.
2) వేదం ప్రమాణం అయినా, భగవంతుడు లేడు. ఇది పలువురు మీమాంసకుల అభిప్రాయం.
3) వేదం ప్రమాణం కాదు, అయినా, భగవంతుడు ఉన్నాడు. ఇది ఇతర దేశాలవారి అభిప్రాయం.
4) వేదం ప్రమాణం కాదు, భగవంతుడు కూడా లేడు. ఇది చార్వాక బౌద్ధ మతాలకు చెందినవారి అభిప్రాయం.

ఈ నాలుగింటిలో ఏది నాస్తిక వాదం? అని అంటే, చివరి రెండు వాదాలు నాస్తిక వాదాలు. భగవంతుని ఒప్పుకోకపోయినా, వేదాన్ని ప్రమాణంగా అంగీకరించేవాడు ఆస్తికుడే. భగవంతుని ఒప్పుకున్నప్పటికీ వేదాన్ని ప్రమాణంగా అంగీకరించనివాడు నాస్తికుడే అవుతాడు. ఇందుచేతనే శ్రీమద్రహస్య త్రయసారంలో శ్రీదేశికులు "ఆస్తిక్యాత్" అనే పదానికి వివరణంగా "వేదాలు వివరించి అర్థం అంతా సత్యం– అని అంగీకరించేవారు" అని అన్నారు. భగవంతుని విశ్వసించడం కంటే కూడా వేదవిశ్వాసం ముఖ్యమైనది అనేది మనవారి సిద్ధాంతం. "నాస్తికో వేదనిందకః" అని అమరసింహునడుచెప్పే పలకడం కూడా ఇందువల్లనే. నాస్తికుడు అనే పదం, వేదనిందకుడు అనే పదం పర్యాయపదాలు. ఒకే అర్థాన్ని ఇచ్చే పదాలు.

29) నడాదూర్ అమ్మాళ్ తత్త్వసారమనే గ్రంథంలో "దూరే కారణదోషబాధకధియోర్నాథే పుమర్థే స్వతః, ప్రామాణ్యం న కథం భజంతి విధివత్ మంత్రార్థవాదోక్తయః" అని చెప్పబడింది. వేదంలో విధి వాక్యాలు మాత్రమే ప్రమాణం, మంత్రాలు, అర్థవాధాలు ప్రమాణం కావు అని కొందరు పలుకగా, వారిని చూచి అమ్మాళ్ అడుగుతున్నారు. ఎందుకు వేదం మొత్తం ప్రమాణం కాకూడదు? ప్రామాణ్యానికి కావలసిన అంశాలు వేదంలో అన్ని భాగాలలోను ఉన్నాయి కదా. మొదటి కారణం కారణ దోషం లేకపోవడం. రెండవ కారణం బాధకజ్ఞానం లేకపోవడం, మూడవ కారణం పురుషార్థం అయిన భగవానుడు ప్రతిపాదింపబడడం. ఈ మూడిటిని కొంచెం వివరంగా చూద్దాం.

కామెర్ల రోగం వచ్చినవానికి తెల్లని వస్తువు పచ్చగా కనిపిస్తుంది. ఇది కంటిలో ఉండే దోషం. పల్ల ఏర్పడుతుంది ఇది ఒక కారణ దోషం. అందువల్ల ఏర్పడిన పచ్చగా ఉన్నదనే జ్ఞానం వాస్తవం కాదు. అందుచేత అది ప్రమాణం కాదు. వేదంలో ఈ విధంగా ఏ కారణదోషం లేదు. అందుచేత వేదం ప్రమాణం అవుతున్నది.

దారాన్ని తొక్కి అది పాము అని భయపడినవానికి, తరువాత జాగ్రత్తగా గమనించినప్పుడు అది దారమే, పాము కాదు అని తెలుస్తుంది. మొదట కలిగిన పాము అనే భ్రమం, తరువాత "అది తాడు అని తోచిన జ్ఞానం వల్ల బాధింపబడుతున్నది. అందుచేత మొదట కలిగిన జ్ఞానం ప్రమాణం కాదు. వేదం చేత తెలియబడే జ్ఞానం అయితే, ఆ విధంగా బాధకప్రత్యయాన్ని దేనినీ కలిగి ఉండదు.. అందుచేత అది ప్రమాణం కాదనే అవకాశం లేదు. పురుషార్థం అనే ఫలం లేనిది అంతా ప్రమాణం కాదు అనిఏ ఒక వాదం ఉన్నది. వేదం అయితే, పరమ పురుషార్థమైన భగవంతుని తెలుపుతున్నది. ఈ రీతిలో కూడా వేదం అంతా ప్రమాణం అవుతున్నది.

30) భోజరాజు రచించిన కావ్యం ఇతిహాసాలు, పురాణాలు వలె మనకు ప్రమాణం కాకపోయినా, ఆ కావ్యం ఆరంభంలో ఉండే ఒక శ్లోకం మన పూర్వాచార్యులు అతడు తన కావ్యాన్ని "వేదం ప్రమాణం" అనే అంశంతోనే ఆరంభిస్తున్నాడు.

"ఉచ్చైః గతిః జగతి సిద్ధ్యతి ధర్మతశ్చేత్
తస్య ప్రమా చ వచనైః కృతకేతరైః చేత్" అని ఇక్కడ కృతకేతరవచనం అనేది సాధారణంగా వేదవాక్యాన్ని తెలుపుతున్నది. ధర్మానికి ప్రమాణంగా ఆ కృతకేతరవచనం అవుతున్నది–అని భోజరాజు పలుకుతున్నాడు. దీనివల్ల వైదికులను నమస్కరించటడంకోసం మంగళశ్లోకాన్నే అతడు రచించాడు.

లోకంలో ఉన్నత గతి ధర్మం వల్ల కలుగుతుంది. దాని అస్తిత్వం తెలియడం వేదం వల్లనే. ఆ వేదాన్ని అధ్యయనం చేసేవారు ఉన్నతులైన బ్రాహ్మణులు. అటువంటివారికి కాకుండా ఇంకా ఎవరికి నా నమస్కారం చెందుతుంది?అని అన్నాడు, అతడు.

ధర్మ జ్ఞానం కలిగించడం, ఉన్నత స్థితిని కలిగించడం, తనను అధ్యయనం చేసేవారిని నమస్కారార్హతను కలిలిగించడం మొదలైన గొప్పతనాలు వేదానికి ఉన్నాయి అని ఈ మహానుభావుడు అంటున్నాడు.

ఈ విధంగా పూర్వాచార్యుల శ్రీ సూక్తులను అనుసంధించిన తరువాత ఒక సత్కావ్యం లోని సూక్తిని కూడా గమనించడం జరిగింది.

ఈ విధంగా ప్రసిద్ధమైన గ్రంథాల నుండి వేదమే గొప్ప ప్రమాణం అని ముగించిన తరువాత కూడా ఒక మహాసమర్థుడు ఆక్షేపిస్తున్న అతని ఏమంటే–

వేదం అతీంద్రియ విషయంలో బలమైన ప్రమాణం అని సిద్ధాంతి అయిన నీవు చెబుతున్నావే! మాకందరికీ వేదం పెట్టిన బిక్ష వల్లనే ప్రామాణ్యం అని అంటున్నావే! దీనిని బలపరుస్తున్నట్టు వేదం కాకుండా 30 కి మించిన పుస్తకాలనుండి ప్రమాణాలను చూపుతున్నావే! దీనిని ఏ విధంగా అంగీకరించడం? అతీంద్రియ విషయంలో వేదమే మూల ప్రమాణమా? కాదా? అనే విషయాన్ని నేరుగా కంటితో చూసి గానీ, చెవులతో విని గాని, ఈ విధంగా ఉండే మార్గాలలో తెలియడానికి సాధ్యం కాదు, కనుక, వేద ప్రామాణ్యం కూడా అతీంద్రియమే అవుతున్నది. నీవు చెప్పిన దాని ప్రకారం ఇందులో వేదం మాత్రమే మూల ప్రమాణం పా గలడు ఎందుకోసం సమాన వాక్యాలను వేరు గ్రంథాల నుండి ప్రస్తావిస్తున్నారవు? అనేది అతని ఆక్షేపం.

దీనికి మన సమాధానం ఏమంటే –మొదట, ఈ 30కి మించిన గ్రంథాలు ప్రమాణం కాదు అని మనం పక్కకు పెట్టలేదు. అదే అర్థాన్ని చెప్పే వేదవాక్యం మనకు తెలిసేవరకు వాటిని నమ్మవద్దు అని మనం చెప్పలేదు. రెండవ విషయం ఏమంటే, వేదంలో కూడా వేదప్రామాణ్యాన్ని చెప్పినందున ఇతడు చేసే వాదం భగ్నమవుతున్నది.

వేదంలో వేదప్రామాణ్యం రెండు రీతులుగా చెప్పబడింది. వేదంలోని అర్థాలు చక్కగా నిశ్చయింపబడినవి, ప్రమాణ సిద్ధంగా అంగీకరించదగినవి— అనేది ఒకటి. వేద ప్రామాణ్యాన్ని ఒప్పుకోకుండా పరతత్వాన్ని దేనిని తెలియడం సాధ్యం కాదు అనేటట్లు వేదం ఒక్కటే మూల ప్రమాణంగా ఉండడం రెండవది. ఈ రెండువిధాలైన వేదవాక్యాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః" అనేది మొదటిది.
"నా వేదవిత్ మనుతే తం బృహంతమ్" అనేది రెండవది.

వీటిలో, మొదటిది ఉపనిషత్తులోను, రెండవది కాఠకంలోనూ ఉన్నది. బ్రహ్మవిద్యోపనిషత్తులో ఇంతకంటే స్పష్టంగా దీనిని దర్శించవచ్చు.

శ్రుత్యా యదుక్తం పరమార్థమేతత్
తత్సంశయో నాత్ర తతః సమస్తమ్,
శ్రుత్యా విరోధే న భవే త్ ప్రమాణం
భవేదనర్థాయ వినా ప్రమాణమ్"

అని— వేదంలో చెప్పినది ఏదో అది వాస్తవం అవుతుంది, ఇందులో సందేహం లేదు, వేదంతో విరోధం కలిగితే ఏదీ ప్రమాణం కాదు. ప్రమాణం లేకపోతే హాని ఏర్పడుతుంది— అని ఈ విధంగా హెచ్చరిక కూడా ఈ శ్రుతిలో చేయబడడం గమనించదగినది..

ఈ విధంగా ఇంతవరకు చెప్పబడిన విషయాలను వరుసగా మనం గమనిస్తే ఈ విధంగా స్పష్టపడుతుంది.

వేదం అనేది–

1) ఒకే ప్రమాణం,

2) ప్రబల ప్రమాణం,

3) అబాధితమైన ప్రమాణం,

4) సహజమైన ప్రమాణం,

5) పరమమైన, అంటే, ఉన్నతమైన ప్రమాణం,

6) పరమార్థమైన ప్రమాణం,

7) సర్వాత్మనా ప్రమాణం,

8)సమ్యక్ ప్రమాణం, అంటే, ఏ భ్రమ, సంశయం కలగడానికి అవకాశం లేని ప్రమాణం,

9) సాక్షాత్ ప్రమాణం,

10) పరిశుద్ధమైన ప్రమాణం,

11) చక్కగా తీర్మానించే ప్రమాణం,

12) స్వతః ప్రమాణం, అంటే, ఇంకొక ప్రమాణం అక్కరలేని ప్రమాణం,

13) సకలం ప్రమాణం, అంటే, ప్రమాణం కానిది ఏది కలవని ప్రమాణం

14 మహితమైన ప్రమాణం, అంటే, పూజించదగిన ప్రమాణం,

, 15) పురాణమైన ప్రమాణం, అంటే, ప్రాచీనమైన ప్రమాణం, 16)సుప్రతిష్ఠితమైన ప్రమాణం,

17) ఉత్సర్గం వల్ల ప్రమాణం,

18) ప్రయోజనం కల ప్రమాణం,

19)అపవాదం లేని ప్రమాణం,

20) నిత్యమైన ప్రమాణం,

21)అపౌరుషేయమైన ప్రమాణం,

22)సపరికరమైన ప్రమాణం,

23 మూలమైన ప్రమాణం,

24)అరుదైన ప్రమాణం,

25)ఆజ్ఞారూపమైన ప్రమాణం,

26)యాథాత్మ్యన్ని తెలుపడం కోసం ఏర్పడిన ప్రమాణం, అంటే, అనన్యార్థసిద్ధ ప్రమాణం,

27)సమర్థమైన ప్రమాణం,

28)అసందిగ్ధమైన ప్రమాణం,

29) లక్ష్మీ కటాక్షం వల్ల తెలిసే ప్రమాణం, మంగళమైన ప్రమాణం,

30)సత్పురుషులకు సంపద వంటి ప్రమాణం,

31 నిర్దోషమైన ప్రమాణం,

32) ఉజ్జ్వలమైన ప్రమాణం.

ఈ విధంగా వేద ప్రామాణ్యానికి 32 విశేషణాలను చెప్పవచ్చు అనేది పూర్వాచార్య సూక్తులు వల్ల మనకు తెలుస్తున్న ది. ఇంకా ఏమి కావాలి? ఇంతకుమించి ఏమి కావాలి? వేదం చెప్పేది అంతా నమ్మి తీరాలి. అదే ప్రమాణాలలో ప్రధానమైనది.

.